కులము। చెరసితినేభవవిభేదంబుదక్కి। గైకొంటినేయసంస్కారులు సేయు। పాకముల్ విడువనె భవులసంసర్గ। పొగ్గులువట్టితి నేజంగమములు। సిగ్గులువర్చితి నేగోష్ఠప్రసంగమున నాదటభక్త శివాచార్యచర్య। విభేదంబు జేసితినె దుర్వినీతి। వలువనెమ్మృడుపరి చర్యలత్యర్థి। నిలువనెగురునాథువలన చిత్తంబు। శిరమొగ్గనేగురు శ్రీపాదములకు। కరముమన్నింప నేగురుకులావళుల। మరువనె పూర్వజన్మము శివాజ్ఞలకు। వెరవనేయవికల విషయేంద్రియముల। కంటిదినె యీశ్వరానర్పితంబు। వంటించితినే వ్రతభాషలయెడల। కనిప్రసాదావలంఘనము సేయుదునె। కొనిప్రసాదముపల్కుచునె రుచులాని। తలచితినే యన్యదైవంబుమరచి। వలచితి నేభవవ్యాసంగమునకు। వలికితి నేతొంట్రుపడయసత్యములు। నలికితనే దూషకావలియెడను। వింటినెశివనింద వీనులయెదుర। గంటినె తెల్లంబు గావ్రతభ్రష్ట। వరిపితినేదృష్టపరభామలందు। గరిపితినేయిట్లు కలహించిపోర। జేసితినేహింస శివభక్తిపరుల। బాసితినేతప్పు బన్నిమిన్నకయు। సమయాపరాధినె జడుడనేయన్య। సమయాపరాధినె జడుడనేయన్య। సమయాశ్రితాచార సిమిశ్రితుడనె। నీతివిహీనుండ నేమదాంధుండ। నేతామసాత్ముడనెహీనమతినె। దుర్మార్గవర్తి నేదురితాత్మకుడనె। కర్మవాదినె యతికాపేక్ష్యామతినె। యుష్టవంచకుడనె దుష్టచిత్తుడనె। శిష్టాపకారినే కష్టమర్త్యుడనె। కోపినెగర్వినెకుటిలాత్మకుడనె। పాపినేగోష్ఠినే బహుజాల్మకుడనె। పరమమాహేశ్వరా పాదితాచార విరహితవర్తినే వేయాలయిట్టి। గురుతల్పనెచ్చనేకూరెనెట్లనిన। ధరశ్రుతివ్యాఖ్యాతాచనామహరియు। పూని శ్రితాచమూల్యేనచమనియు। మానంబెలర్ప సమాహ్వాతాయనియు। తగనేకతోత్కృష్టగతావాపియనియు। నొగిపంచధాగురు దోషతోయనియు। చదువుగాఁవునదమ స్వద్గురుదేవు। వదినెయుమరదలు వారివారలను। వారాంబవిడిచిన వారాంగనలను। వారర్థిసేయు నవ్వారాంగనలను। నెట్టణరోషించి నట్టిలంజియలు। నెట్టినవొకమాతు ముట్టినసతులు। విరచింపనీదైదువిధములవారు। గురురాణివానంబు సరిగోరతల్లి। యీమహాపాతకర చెప్పుదరింతు। నేమిసేయుదు చెప్పవేయమ్మయనుచు। వదలునిలుకు వి

ల్వబడు లేచుజూచు। పడతిపాదంబులపైబడు పెనగు। జనుదల దాకించు
కొనుకడుపుగుద్దు। కోనినేలబడి పొరలి గూయుచునరచు। నోడలువిడువ
జూచు యుస్మలిజూచు। వడిలింగగభక్షణంబు వగచోరజూచు। కాయంబు
దునియలుగా గొట్టికొట్టి। పాయకధరచుట్టి బలిజల్లజూచు। చక్కడ్చి రా
రోట దొక్కి దేహంబు। గ్రక్కునవ్రేట గలుపంగజూచు। గనియలుగా
గొట్టి కాల్చిగినయునవ। పెనముపైతనువిడ వ్రేలువజూచు। కాలిచి భస్మం
బుగా జేసియొడలు। చాలపెన్గాలిలో జల్లంగజూచు। నరుకు లొండొంటి
తో నరుగంగరాచి। నరుకుదేహముబయల్గా జేయజూచు। మరియును నె
త్తైన మడియంగజూచు। మరియట్లుగాక యమ్మగువపైదృష్టు। నాటించి
చూచిన నయనముల్ దులిచి। బెటమాసించి యుబ్బినగోలగోసి। యొంగు
దెంచినకాడ్లు యిలనరికివైచి। కౌంగలించినకాడ్లు యిలనరికివైచి। కౌంగి
లింపగగోరు కరములుదునిమి। చెదురులాడేనుజింహ్వా మొదలికిబెరికి।పొ
డలినవక్త్రింబు పొంగడగించి। తలపెత్తిచూచిన తలదెవ్వనడిచి। పులు
కలెత్తినయొడల్ నిలువుతిత్తొలచి। చనుగవగోరువక్షము గాండ బొడచి।
పెనుపొట్టమరిప్రస్సి పేవ్రులుసారి। నెట్టణగుడిసుట్టు జుట్టంగజూచు। నిట్టై
నగానిపోడికర్మమనుచు। గనలుచుశోకాగ్ని కన్నులగ్రమ్మ। కనుగొనియె
దిరి దన్నునుగాన లేక। నదుగునంతనెనిల్చు మరులుగొన్నట్లు। పురి వెల్వ
డి బారి మరలియేతెంచు। గుడిసొచ్చు గుడివెడల్పడివేచుజూచు। యడవు
లపాలయి యరుగునెందేని। ప్రకటితంబుగశోకపారవశ్యమున। యొక
చోటకాలు నిల్వకతిర్గితిరిగి। భ్రమితుడై వాపోవు భక్తయీపాతి। కమ
నకునెరిగురి గలుగునేంకొత। నోప్పారకాల్ద్రివ్వ నోనృపశేంద్ర। చెప్ప
వెనాకింక చెర్గడమెద్ది। యీతప్పునకువిధి యొద్దియోశ్రితుల। జూత్రమా
యురసిదెగా చూతమాయంచు। యోనారికేళంబ యీనారిగుర్తులు।యా
నారియిదియెట్లి నాసిరమికిని। శోకంబులేని యశోకంబయేన। శోకిగా నేర్తు
నాకొకర్త వొడచి। యోఘనసారంబ యీఘనాఘంబు। మోఘంబు నే
యు గ్రిఘాఘంబుగలదె। నాచందమిట్లయ్యెనో చందనంబ। యేచందము
నుగాదు యేమి సేయుదును। భ్రమియింపుచున్న యో భ్రమరమా యిట్లు

భ్రమియించుచున్న నా భ్రమయెట్లువాయు। యేకాయుకోఁయిలా రొంద
బడిగాంగ। నాకాయియడుగున నేకాలమైన। పురివిచ్చియాడుయాఁపు
రినమ్మిశిఖరి। పురియమ్మియేజము పురికెట్లువోదు। యేగతియును లేమి నే
రాజహంస। కెరింగోయనుచు మమ్ము గేలిజేసెదవు। యోపల్కు కీరమా
యోడకుమనుచు। నాపల్కులుడుపంగ లేపల్కుఁగలుగు। విప్రమైయున్న
యోదపరిమాయావు। హాప్రమాదము వాయు నేపరిమాణమున। రుద్రి
నియోముఖ భదరిమాయాయు। పద్రవంబెట్లుదా భద్రమైతినరు। నా
కునోనంది మహాకాళులార। యేకాలమునగూర్చు నేకాలకళుడు। ముం
దటనున్న యో నంది కేశ్వరుడ। నందితబంద నాకందెట్లువాయు। యో
వీరభదరియరో విదితంబు। గావిధిదీనికి గల్గునోకొంత। ప్రథితులై చనునో
పరిమధులార పాపమధనంబు గావించు మతముదా నెట్లు। యోపురాతను
లార యోపుడునయ్య। యీపాతకముదరి యింపంగనింక। యూకుండగ
దగదో యసంఖ్యాతు। లారయట్లడగు నాకీగోదనంబు। యేలయో వీర
మాహేశ్వరులార। యాలింపుడింక నాయరివిరివిధము। చెచ్చెర వేయును
జెప్పంగనేల। చచ్చిశుద్ధుడశాదు శంకరాయనుచు। నందందపాడిలో నా
చిఱ కేలంకి। కందికొయ్యలు రెండు కన్నులదోరిపి। క్రమమున దేహంబు
గండ్రిలు సేయు। దమకించియున్నయత్త రీనటమున్న। వృత్తాంతమంతయు
వినియక్షణమున। వృత్తుందుచిత్సుఖాయత్తుండుగుణస। మగుిందు స్వగు
ణహస్తాగ్రిజన్ముండు। దగ్రితనే తెంచి తమ్ముని గదియ। బిత్తులిక్క గురుభ
క్తిప్రీతిసంభ్రమము। రెట్టింపదుఃఖాగ్ని నెట్టుకొనంగ। బరతెంచి యడగు
లబడివాయివిడిచి। యరచుచులేవక యట్లువాపోవ। గురుభక్తివర్ధన గు
రుభక్తితిలక। గురుభక్తిశృంగార గురభక్తిసార। వందకుమనసున గంద
కుమాత్మ। గుందకుమెందును గోరతలేదింక। పడిసన్న యట్టి యుష్మద్గురు
భక్తిగడచనుభక్తుల కవిలయకెక్క। నేపారవేయును నేలదుఖ్కొపా। తా
పోపశమము నుద్ధతినిర్వహింపు। లెమ్మని శేసాచి లేవనెత్తి కూర్మి। గ్ర
ష్మంగనందంద కౌంగిటజేర్చి। యూరడిల్లగ శిరంబురమున నొత్తి। కారెడు
రక్తాశ్రుకణములందందంద। దుడుచుచుభక్తి సద్గురులింగమూర్తి? యుడుగు
లుదలప నయ్యాండారికపుడు। కన్నులు రెండు నొక్కట దేజరిల్లె। పన్నగ

ధరుభక్తవరులుహర్షింప। భువిజనుల్ నెరవి యద్భుతలీలఁజూడ। నవిరళ
భక్తిదళ్ళివసహోదరుడు। దండియయి గురుభక్తాండారికిచ్చె। రెండుకన్ను
లునాడు ప్రీతితోనేడు। పాదముల్ గృపసేసె పండితారాధ్య। లాదటభ
క్తిమహాత్త్వంబు వెలయ। తెల్లంబుగా మహాదేవయ్యగారి। కెల్లవారును
జూడ నిలనట్లుగాక॥ మలహారుసద్భక్తమత్తవారణము। బెలిదేవి వేమన

## బెలిదేవి వేమనారాధ్యులకథ

పెద్దయ్యగారు। శ్రీశైవసమయైక దేశికోత్తముడు। పాశవిమోచన పటు
కళావిదుడు। సకలంకదివ్యాగమార్థసంవేత్త। ప్రకటచతుర్వేద పారంగ
తుండు। ఖ్యాపితధర్మార్థకామమోక్షప్ర। దీపితమార్గ ప్రతిష్ఠితకీర్తి। మహి
తపంచాక్షరీ మంత్రసిద్ధుండు। సహజకటాక్షవీక్షణ దయాంబోధి। వీర
మాహేశ్వరాచారవిస్తార। సారగుణోదార చారువర్తనుడు। బసవపా
దాంభోజ భాజనస్వాంతు। డసమశాపానుగ్రహసమగ్రబలుడు। ఆనతజన
మృత్యుహారణప్రభావు। డానతజనపునరాయుః ప్రదాత। సర్పవృశ్చికమృ
గశ్వసజలాగ్ని। దర్పితమృగచోర దర్పాపహరుడు। నానాదిసకల జనా
నందకరము। గానిట్లువర్తింపగా నొక్కనాడు। సొరుగూరనుండి భూవరు
లొక్కరుండు। పరిణయంబై తన పత్నియుదాను। వెసవచ్చివచ్చి యవ్వే
మనారాధ్యు। నహలారగాంచి జోహారని మ్రొక్క। బుధపుంగవుడుపువ్వ
ములుగోసికోసి। యధిపునయ్యశ్వర ధారాధుజూచి। యార్తివిదూరుడ
నాగతాతీత। వర్తమానజ్ఞానవంతుండుగాన। యాతడల్పాయుష్యుడౌటతెలి
రింగి। యాతనిదీవింపకవుల నేగుడును। విసతుండనైతి దీవింపరువీరు। వని
తయునవ్వునో యనచులజ్జించి। వినడకో నాజోహారనువచనంబు। వినినేని
డానెట్లుచని యెనోండెడకు। కనుగొవడోకొనాడు కరములెత్తంగ। కను
గొనడేని నాక్రమమెట్టిదింగ। చేయెత్తి మ్రొక్కిన నాయయ్యగారు। వా
రెత్తుకునికి గర్వమొయంచు బండి। దిగమోరికి వెనువెంట దగిలిరు గేలు।
మొగిడించియయగారు మ్రొక్కెదననుడు। వెండియునతని దీవించకయు
న్న। దండిరైన్నృపకుమారుండంతబోక। కొంతలజ్జయు నొకకొంత గోపం
బు। కొంతభక్తియుదొంప సంతతాభ్యుదయు। కరుల్లుమహాభక్తవరులు
భూసురులు। హర వేషధరులఘ హరుల్చుచిత్పరులు। ఆర్యులుశివమతాచా

ర్యులవార్య। వీర్యులుసన్మార్గ చర్యులుత్తములు। మీరని మ్రొక్కుడు చే
లెడమనక। యూరక యుండుట యుచితమె బెంపె। పెద్దతనంబె గాంభీర్య
గుణంబె। తద్దయుభక్తియె తగవె పూజ్యతయె। యీమూర్తి యీ వేష
మీ దేశికత్వ। మీమహనీయత కీయహంకృతి గాదె। నీవునన్నిప్పుడు దీవిం
పకున్న। నావంతయును నాయు వదితక్కువగునె। నీవు నన్నిప్పుడు దీవిం
చుమాత్ర। నావంతయును నాయు వదియొక్కటగునె। యనని వారల నీవు
మనిపెదవయ్య। తను బొందుమృత్యువు దాసిరొందీకు। పద్మబ్రహ్మ నుదుట
మున్ వ్రాసిన వ్రాలు పెడతటికెంగునే పెక్కులేటికి। తనపూర్వ లిఖి
తంబు దప్పించిపిదప। వనజజుడైనను మనజేయగలడె। వెయ్యేడ యిట్టి వే
మెరుగము మీర। లయ్యగారయ్య లోకావలికెల్ల। యిల్లైన గృతమతులే
లచాటింతు। రిట్లైన రెవ్వరిట్లైల మ్రొక్కెదరు। అలించి మేలెడ మనినమీ
నోరు। గోలుపోవునెయిట్లు గురుమార్గమిదియె। మీకయుండెదు గాక
మీమహత్వంబు। మాకేమిదీవింప మరిబుద్ధులేరె। అనవుడుయెల్లిమధ్యా
హ్నంబునకును। మనుజాధిపుడనీకు మరణమయ్యెడిని। యిట్టియల్పాయు
ష్యనెంతరాజైన। నెట్టిదీవింతు మున్నెరిగి మెరింగి। తివిరియల్పాయుష్య
దీవింత్తురెట్లు। శివభక్తులటుగాన చిరదయామతిని। దీవించి రేనియు దీర్ఘా
యువగును। వాఖిరిగృపసేయ వలదుగావునను। వాదేల దీవన నాదువా
క్కులకు। రాదుసీతొంటి ప్రారబ్ధమెట్టిదియొ। నీచావుదప్పదు నిక్కునం
బెల్లి। లేచనుమన్మథు నవ్విభుడుగోపించి। వలచికావగ లేడువర పుత్త్రవిష్ణు
డలిగిచంపగ లేదు యాజలంధరుని। వలచిబ్రహ్మయు తనతలగావ లేడు। అ
లిగిచంపగలెండు యాగజాసురుని। అలిగినప్పుడు చంప వలచినగావ। దల
మేఘాలాక్షుండు దక్కమర్త్యులకు। పరమేశలాంఛన ధరుడవుగాక। నరు
డు మ్రొక్కినమాత్ర హరుడవీవగుదె। నిక్కంబుపోమగి నీమాటలెల్ల। జ
క్కవనెల్లియు జచ్చితి నేని। యిలనెందు నయ్యగారలు మిమ్ముపోల। గలు
గరుబొమ్మంచు గర్వోక్తులాడి। చనినిజాంతర్గృహమునసతిద్వాను। ననుప
మసురత సుఖాబ్ధిదేలుచును। ప్రధుతరానోన్య సంప్రీతినవీన। మ్మథనాబ్జ
దళుకొత్త మగ్నతదనర। సలసిలావరి మర తాంతరబువందు। సొలసినిద్రిం

ప నయ్యూలచేరు వెంట। అరిమురినొక్క మహావిషోరగము। పర తెంచియు
తని యుష్పలవాయిగరచి। పెలకలబడుడు నవ్వాలదిమేల్కొంచి। బెలుకు
ర్కొహాయని బిమ్మటనొందు। కలకలంబుజనపతి గ్రక్కున తెచి। బలువిడి ర
క్తధారలువారుకరము। ఘనఘోరసర్పంబు గాంచిమూర్ఛిల్లి। జనపతియ
ప్పుడు జచ్చెచచ్చెడునే। ఆద్యులునను భవవేద్యులు శాస్త్రి। వైద్యులు
గారుడ వరమంత్రవిదులు। జనుదెంచిభిను చే జచ్చినన్నృపతి। గనుగొని
నిజయశక్యంబంచుకొంగ। మఱియొక్క గారుడ మంత్రసిద్ధుండు। జర తెం
చివిషదగ్ధ భావంబుజూచి। యక్కటాకరచెరా హరహరపాము। నెక్క
నికాలంబు నిండెనో కాక। సుమహత్ప్రతాప వాసుకిమణినాగ। విమలక
ర్కోటక కుముదాతుకుముద। శలపోతకాసీల శబలాశ్వతరవి। మలిన
పిండకరవా మనకూహకోట। నఖమహోదరహావిర్ముఖ హేమశంఖ। సఖ
హావ్యకర్ణ ధనుంజయపంచ। రకపరివర్తకార్యకశిభినిష్ఠు। రకు మిత్రకల్మ
షైరావతశబల। కాలకౌశికతక్షకాశేషశంఖ। పాలపుండ్రక ముద్గశైలా
సు తాది। నాగసహస్రమెన్న గనందష్ట। నాగంబులన నిరునాల్గుజాలకును।
స్వాములైతమతమ చాతులయందు। నేమించికరచుదుర్నీతిపాపులను। ధ
రణిగారుడమంత్ర తతోవిధముల। పరమమృత్యువుదక్క బాయుతద్వి
షము। వెండియుగజడు దుర్ముఖుడుమిత్రాది। గండపాదుడుకుళికుండు
శేణికుడు। జనకుండు స్వర్ణకుండును మొదల్గాగ। జసుకిల్విషోరగ శతస
హస్రములు। సత్సమకిల్విష సర్పముల్పరమ। మృత్యువాసన్నమై వెండ
దొరికియున్న। గారుడక్రియబల్క నేరకుండిసము। ధారుణి మంత్రౌషధ
ములచేబాయు। యూవేళయీజాతి యిన్నిదంతంబు। లీవలయీయంగమి
టయనిచెప్ప। తమతమఫలతులు తప్పకకరుచు। నమితమహాష్టనాగాంశో
రగములు। గారుడమంత్ర సంస్కారప్రశస్తి। నారంగనావేశమతనికివచ్చి।
పలుగుననాగతంబులు జెప్పవిషము। దొలిగించు పరమమృత్యువుగానినా
డు। అపమృత్యువులనైనన్ని దంతములు। నపరిత్రనాటిత నరుడుదక్కింప।
అగ్నికొంకలను జలాభిషేకముల। లగ్గగనొక్కపల్ నాటునాటినను। దుం
డిమంత్రముల బేదరియుదంతములు। రెండూన నౌషధక్రియలచేబాయు।
సరుమూడుదంతముల్ నాటినవెంగు। పరువడిమూరినాల్గు పడ్డ నాటినను।

ధరమంత్రతంత్రౌషధక్రియలేల। హరివేషలకుగా వసరుదుగావునను। అది
యునుగరో్కటకాంశమీపాము। బొదలనాలుగుదంతములుగాడినవియు।
పాలలోచనుడహిపతి కంకణుండు। కాలకాలుండునిర్గత మృత్యుభయుడు।
కాలకంఠుడు గావజాలునోయతడు। జాలడోచాల సంశయుగుంచు నరుగ।
గమియంగనార్తారవములు హాహార। వములునురస్తాడనములు జెలంగ।
పరిజనుల్ పురిజనుల్ బంధువర్గంబు। పొరిపొరివాచర్వ పొలతిదోడ్తోన। త
ననిశ్చయము జేసి తనమనోహరుని। గనుగొని యాయయ్యగారి వాక్యార్థ
బు। దప్పదుపొమ్మంచు దత్ప్రసంగంబు। బెప్పుడుజనకులు చెలులు చుట్ట
ములు। వినియుంశనన నేల వేయుతుజనుడు। చనియుందరమునయ్య శరణు
పోత్తుండు।వయిచుడాయయగారివాకిటశబము।దయసేయకదియెట్లుదప్పిం
పవచ్చు। నంచునందరుసెంగి యయ్యకు మ్రొక్కి। పంచత్వమున బొందె
ప్రభువమీబంటు। లీలమీదీవనలేమి దదియు। కాలమూసన్నమై గడచె
గదయ్య। అదియేలతప్పుమీ యాధతిజయ్య। సదమలసద్భక్తహృదయా
బ్జశయ్య। చిరసఫలీకృతా శీర్వాదనాద। పరిచితానంతార్థ పరిమితవే
ద। పరమసుఖావేశ భరితప్రమోద। త్వరితసంతతమహాదానవినోద। అ
విరతనిరతిశయాగణ్యపుణ్య। ప్రవితతోద్ధతవీర భక్తాగ్రగణ్య। అశరణ
జనతా సమగ్రశరణ్య। పశుపతిసమయాధ్వపథికవరేణ్య సకలలోకైకప్ర
సాదితకీర్తి। ప్రకటితశివయోగ పరతంత్రమూర్తి। స్థిరపశుపాశ పరిజ్ఞా
నవర్తి। పరమవీరవ్రతపథచక్రవర్తి। కాలాహిదష్టుని గరుణించికావ।నా
లించియోడకుండని దయబ్రోవ। నభయాత్ములకు మాకు శరణంబ వీవ।
యభయమెయోవేమ నారాధ్యదేవ। ప్రతిదక్కమీదయ బడయంగలే
క। యితడుకాలాహికాటుచే యయ్యోనిపుడు। మ్రొక్కకచెడుటది మో
స బుద్ధాన। మ్రొక్కెగదయ్య యీముగ్గుండుమీకు। ముసిడిచౌడయ్య
కుమ్రొక్కెనకన్య। యసలారదీవన లంద దేవేవ। దీవించి కొనిపోయి జీ
వంబువిడుప। భావించిపడయడే పాలబూయయ్య। అప్పుడకన్యకు న
ల్మొయువనుచు। నెప్పాటదీవించ కెంగిరేవారు। జనకులుతమకూతు శవ
మప్డుదెచ్చి। మునుకొనిచౌండయ్య ముందటబెట్టి। సీదీవనయుదప్పునేదేవ
యనుచు। పాదాబ్జములిలమీద బడ్డి లేవకున్న। యువిదకు ప్రాణమునునికిన

ముసిడి। చవుడయ్యవడయుడే జగమెల్ల నెఱుఁగ। గానభక్తులభక్తి ఘనత ద
లఁప। గానిదిదానెంత కార్యంబు దేవ। గావునముముఁగటాక్ష వీక్షణమున।
భావించి యితనికి ప్రాణదానంబు। సేయవే యనుచు నత్యాయుత భక్తి।
బాయక మ్రొక్కుచు బ్రణుతి సేయుచును। శరణన్న గాచు మీ బిరుదింక
నేఁడు। పరమాత్మ మఱవంగ బాడియె దేవ। యభయంబు వేడిన నాలంబు
సేత। యభయాత్మ యిది మీకు విభవమే దేవ। మఱవు సొచ్చిన వేఱె యొఱ
వున బోవ। మఱువీరభక్తికి యోగ్యమే దేవ। దెసదిక్కు నుసీవ నా నుసిలిపో
వంగ। నసమానమీకిది యంగమే దేవ। గతియును మతియు నెడ్డవనీ వెయ
నగ। బ్రతియు సూమి భక్తి పాడియె దేవ। యనుచు ప్రార్థించుచు నడుగుల
కెఱఁగు। చనుముట్టముదలించుచును గుణస్తుతులు। దనలి సేయుచు ప్రాణ
దానంబు వేఁడి। కొనుచు కృపావలోకనముగోరంగ। సతిదయాభావననత
గులజూచి। యతులసద్భక్త మహత్వంబు దలఁచి। శరణన్న నరుఁగావ జాలక
యున్న। హరుభక్త మాహాత్మ్యమడఁచుటగాదె। ముదలించి సలుకంగ మూ
ర్ఖులతఁగిలి। మది నైన గోపించుటిది వెల్తిగాదె। మీఱిన సద్భక్తి మితిముట్ట
బలుకు। జాఁచిన నవ్వాఁడే శరణవత్సలుఁడు। దాతబుత్తెంచిన దండుపై విడియ।
భీతిల్ల పాఱుట బిఱుదు తనంబె। ప్రాణదానము వేఁడి భక్తిపై మోప। ప్రా
ణవంచేన సెంత బంతమే యనుచు। శివభక్తి వితతి చెచ్చెర బిల్వంబంచి। యవి
రళభక్తిసాష్టాంగుఁడై మ్రొక్కి। యనువక్తి విపుల సింహాసనాసీను। లను
జేసి కేళికలును వడిదనర। నాయతి చాంగుభళా యనురవము। ఘోయనుర
వమును బాయక మ్రోయ। కవులు పాఠకులు నాకాంక్షఁ గీర్తింప। వివిధ
వాద్యధ్వనుల్ దివిదీటుకొనఁగ। మృడభక్త నివహంబు లడుగులా కాంక్ష।
గడిగి తత్పాదోదకములు కుంభముల। పట్టి సభాస్థలి బెట్టి వాసెనలు। జట్టిజ
నావళి జూడ నర్పించి। హరభక్త వితతికి నక్షతగంధ। వరపుష్పమాలికోత్క
రములర్పించి। ఘోరున బహుఘంటికారావమెసఁగ। నారంగ ధూపదీపాదు
లొనర్చి। స్ఫుటభక్తి యుక్తి విభూతిపేఁడియము। లటుగూడ భక్త జనావళికి
చ్చి। యసలార నవ్యపుష్పాంజలు లెత్తి। వసుధ మున్మూఁరు గావలఁగొని
మ్రొక్కి। యనుపమభక్త గణాజ్ఞాపనమున। జనపతి శిబము దెండని పన్నన
దియు। తెఱఁగివ వెలిగ్రుడ్లు దెఱచిన నోరు। సరమోయిడిన రెప్పలు రుతరో

ష్ఠములు। గ్రుంగినకటము లెక్కడు పొత్తనగుచు బొంగి దూలము లిర్గివం
గినముక్కు। పచ్చనిపండ్లు పెల్లుడు తీగచొల్లు। విచ్చినరంధ్రముల్ వీడినకొ
ప్పు। సంగవిచ్ఛాయముబొంగినకడుపు। వంగినవంపును వ్రాలినశిరము।
పొందఁగ్రస్గ్రొంట్లు పోయినసందు। సందుల నెత్తురు సచ్చినతోలు। కళద
ప్పిబలసి దుర్గంధంబు ప్రాయు। పలచుచుదను పెక్కు వాచినమేను। మూం
గుచుజుమ్మని వీంగుచుమరియు। మూగుచుమునగు నయ్యీగలుజూడ। కం
పునవము భయంకరమునువొంప। గుంపిడిజనులుముక్కులుబట్టుకొనుచు।
కటకటాయంచు నెక్కడిదింకయనుచు। దొటుకునను మియుచు దొలగిపో
వంగ। ననుపమభక్తవభాభ్యంతరమున। జనులుతజ్జననాథ శవముదెచ్చు
టయు। నప్పాదజలముల నాతనిదేహ। ముప్పగాగంపు లేకుండ డోమిం
చి। భక్తలింగముల శ్రీపాదధూళియును। భక్తహస్తార్పిత భసితంబు గల
య। తత్పాదజలమిశ్రితము జేసిభక్తి। తాత్పర్యమతివానితనువునబూసి।
యాపూతపై త్రిపుండ్రాంకముల్ దీర్చి। రూపితాంగముల నారోహణ
జేసి। మండితభక్తి నిర్మాల్య పుష్పములు। దండలుగాగట్టి తనువున జుట్టి।
దురితవితానగోధూమఘరట్ట। ధురకీర్తి వేమసద్గురుమూర్తి మరియు మం
డితాసంఖ్యాత మాహేశ్వరులకు। దండప్రణామముల్ తగనాచరించి। న
య మొందవినయ వినమితోత్తమాంగు। డయివీరభక్తి మహత్వంబుమె
రసి। విజ్ఞాపనంబు సద్విధి జేసితద్గ। ణాజ్ఞాపనంబు దయాసమగ్రతయు। బడ
సి వేండియుమహా భక్తరాజికిని। పుడమినసాష్టాంగముల్ పొందమ్రొక్కు
చును। ప్రమథపురాతన భక్తపాదాబ్జ। సముదితస్మరణప్రసక్తాత్ముడగుచు।
పంచాక్షరీమంత్ర భవ్యకళాప। సంచితానుష్ఠిత మహిమదొలార్కుడ। భ
ద్రభక్తార్పిత భసితశేషము నమ్ము। ద్రితునృపపుత్రు మొగమునజల్లి। లె
లేలెమ్మనుచు నవలీలదయావి। శాలతనతనిహస్తముపట్టితివియు। నంతలో
ననపజీవాంగుడై గతక్ర। తాంతక మృత్యుభయాక్రాంతిమతిని। బడిగొ
నివేమన స్వామిపాదములు। విడువకనందంద వినమితుండగుచు। గృపయు
నుభక్తియు కీర్తియునదనర। నృపపుత్రులింగ సన్నిహితుగావించి। నవ్వేమ
సయ్యయు నతిభక్తిమహిమ। నివ్వటిల్లగదాను నృపసుమారుండు। సతు
లతదీయ్య మహాభక్తగణవి। తతికి సాష్టాంగులైధరజాగిమ్రొక్కి। నయ్యె

సంఖ్యాత మహాభక్తవరులు। సయ్యన వేమనాచార్యానవార్య। మహాని
య్యాసద్భక్త మహితపదాబ్జ। నిహితశిరోభాగునిత్యానురాగ। పరమమా
హేశ్వర పాదాబ్జరేణు। పరికల్పితలలాటు భక్తికిరీటు। శరణపాదాబ్జభా
స్వరమకరంద। పరిశేషసర్వాంగు బహిరంతరంగు। గణపాదనఖరదర్పణ
భాసమాను। గుణగణాంచితదేహు ప్రణుతదాస్యోహు। భక్తాంఘ్రినఖ
కాంతి పటుచంద్రికాప్ర। సక్తదివ్యచకోరు సత్యవిస్తారు। శతపత్ర సంభవ
కృతదురక్షరని। యతదురాసక మహిమాఢ్య సమాఢ్య। అనుపమవిష్ణు
మాయావినిర్దళన। వినుతచిద్విద్యా ప్రవీణునక్షీణు। పశుపాశమోచన
పాటవధుర్య। పశువాహనసమాను భక్తనిధాను। యుద్ధత మృత్యుదం
ష్ట్రోత్పాటనప్ర। శిద్ధకశాకల్య శివగణకాల్య। సురుతర దండదగోద్ధండ
ఁడ। వరనిహూతిక్రియాచరితుప్రఖ్యాతు। విజితకాలోరగ విషహరుధీరు।
నిజదయామృత పయోనిధినోలలార్చి। యరిముదిదనర సాష్టాంగుడై మరి
యు। మరియునుమరియును మహిజాగిమ్రొక్కి। వేమనారాధ్యసంవిత్సు
ఖసాధ్య। నామహాభక్తులత్యర్థివేసత్తి। లాలితానోన్యప్రియాలింగనో
ప। లాలనాదిక్రియాలంకృతుజేసి। బాపురే వేమన ప్రభువసర్వజ్ఞ। బాపు
రె వేమన సద్భక్తమనోజ్ఞ। నల్లవో వేమనముల్లాసకీర్తి। నల్లవో వేమసాసం
దైకమూర్తి। పీనుంగునకు ప్రాణదానంబుసేయు। గానికిచనుగాక కరు
ణాభిషేక। హరివేధలవశంబె యమునోరుదాప। పరమమృత్యువు ద్రోవ
ప్రాణంబుగావ। నిట్టివీరత్వంబు నిట్టిధీరత్వ। మిట్టిమహత్వంబు నిట్టిసత్వం
బు। విందుమేయుందు భావింపవిపేక। కందుమెనీయందు కాకశుశ్లోక।యు
నుచుభక్తవ్రాత మభిరమ్యలీల। వినుతింపఖలిదేవి వేమయ్యగారు। సచ్చి
నన్నృపతనూ జాతునిప్రాణ। మిచ్చెనచ్చెరువుగా విదితమమహిమ। అప్పా
టనిప్పండితారాధ్యదేవు। దొప్పారగరుణ నేదోసగపాదములు। తెల్లంబు
గా మహదేవయ్యగారి। కెల్లవారుసుజూడ నిలనట్లుగాక॥ మహిసకలేశ్వ

—•—•◆సకలేశమాది రాజయ్యకథ◆—•—•—

రుమాదిరాజయ్య। మహితశివాచార మార్గవర్తనుడు। కాలమృత్యుప్రోక
నుగవధూళిజల్లి। కాలునినోరుడా కాలనదన్ని। వీక్షతో మృత్యువడి విడగట్టిపి
ౘర। తాంకవట్టించి విధాతృగీటణచి। అనంగవిష్ణుమాయాంతకుడవగ।దా

రలుఘూర్ణిల్ల తన తేజమలర! రూఢిశతాయుః పురుషయను శ్రుతుల ।
కాడలుపడభువి నేడు నూరేండ్లు! లింగార్చనక్రియాలీలసోలుచును! జంగ
మారాధనాసక్తి వ్రాలుచును! వరనాధసుఖసుధావార్ధి దేలుచును । పర
మశివాచార సరణి నేలుచును॥ జరియింపజరియింపసాత్వికభక్తి! చరణు

## చిక్కమాదరసుకథ

చిక్కమాదరుచునా నొక్క! భక్తుడతిస్నేహబంధురభక్తి! యుక్తిబ్రవ్యక్తి
గానోరంతపొద్దు! మాదిరాజయగారి పాదపద్మములు । నాదటగొలు
చుచు నాలునుసుతుడు! యిదిదమజీవనం బీకుటుంబమున! కిదియు పార్జన
మిది బ్రతుకేట్టనాక! మృదుడకల్పితమైన వెడకాయకయున! వడివెట్టునం
తన మడగిసమృద్ధి! యెంతయు లేమికి వంతయుస్వగృహా! చింతయునాత్మ
నొక్కింతయు లేక! యతిభక్తి మాదిరాజయ్యపాదములె! గతియును మ
తియు నెడ్డడయుగానదువ! కొన్ని దినంబులు పన్న దద్భక్తు! డున్న యునికి న
మృతయుత దేహుడగుచు! పాదోదకములను పతిప్రేమనుగడిగి! బూదిసమ
స్తాంగములనిండబూసి! పడతియాసెబము గంబంబున జేర్చి! యిడనారి
నెవ్వరి నెరుగంగనీక! యింతితదీయ గృహాంతరంబునను! గాంతునిక్షేపిం
పగాగుహ సేయు! చప్పుడువినినిద్ర దెప్పిరిబాలు! డప్పుడు మేల్కాంచియు
ర్ధరాత్రంబు! నోయమ్మ యేమి సేయుచు నున్నదాన! ప్రాయమ్మ్రమా
యయ్యాయునుగంబ మరత॥ నూరకేమిటికి గూర్చున్న వాడయ్య । దాని

## బాలలింగన్న కథ

నేమనికొల్వగా బోడు నేమ! యరగలిగొనగ లింగార్చన సేయు! నరుగేల
త్రవ్వెదవమ్మ యొక్కతవు! చెలిగిలింగార్చన సేయు వేళకును! చెలమ సేసిన
గాని చేకొననంచు! నేమంబువట్టెనో నేడుమాయయ్య! గామించియందు
దకంబులుపడ్డ! కరకంఠునకు జలకంబాచరించి! మరికానిపలుకడోమునతో
డనయ్య! కాదేని రేమేమని కారణంబునను! వాడైనయులగినవాండో నీతో
డ! నేతేరంగున నల్లడింతగాలంబు! నీతోడనలిగిన నెపమేమి నేడు! కాలా
వసరములు గడవెట్టితివా! శీలవ్రతంబులు చిక్కపరచితివా! సమయోచి
తాగత జంగమావళికి! నముచితారాధనలో సలుపకుండితివో! నవినుప
కరణముల్ వెళగవోబింది! యలుగడుగవో పడిగములు పీందు వడెనో!

సమ్మార్జనంబు లొనఁగవో గోమ। యమ్మిక్షజంతువులందడంగిననో। ము
గ్గుసాలదో పద్మములు సెదరిననో। నిగ్గారుగంధంబు నెరసుదోఁచిననో। త
డియొత్తుకరపట్టి తడిసియున్నదియొ। వడిబెట్టవో యర్ఘ్య పణ్యాముల్ గూ
డ। తోఁడిమొబుచ్చినపువ్వు తోలునాటిపువ్వు। గడియువోయినపువ్వు గం
దినపువ్వు। పోలశోధించిన పుష్పంబులందు। దూలిదానొకటైన దొరలి
యున్నదియొ। గుగ్గులంబియ్యవో యగ్గలంబిడిన। యగ్గియారిననొర సాధి
క్యమగుడు। నీరాజనంబులు నియమంబుమితికి। పూరగింపమినొకో యా
రతియీవో। కెలకులదీపంబు లలరవో యొక్క। పొలసెనో కొడిగుర్లు బు
చ్చకుండిననో। మృదునకోగిరములు వడినిచ్చునపుడు। తోడిబడ సందిచ్చి
తో మనంబడితో। అర్పితంబైన మహాప్రసాదంబు। సర్పింపబడని ద్రవ్యము
ల గూర్చితివో। కలపితో త్రివిధోదకములు పూర్వమ్ము। దలచితో తత్ప్రి
సాదంబులవలన। పనిచిన నేమైన పని సేయవైతో। మినికితో బిడిచిన పని
యేమియనవో। మరుమాటవిచ్చితో మందె మేలమున। వెరవు సెడితో
మాట వినవో మార్వడితో। ధరనెన్నడును లేని దాసవో యమ్మ। పొరు
గింటనిరుగింట పొద్దుపుచ్చితివో। యూరకయలిగిన కారణంబేమి। యూ
రకుండంగ నీకుండంగదగునె। అమ్మమ్మ మాయయ్య యడుగులమీద। గ్ర
మ్మనబడదండు రా నీవు నేను। అలుకదీరెడుగాక బలికెడుగాక। యలిగెడు
నెపమిది యనియెడుగాక। వడిశివార్చన సేయ వచ్చెడిగాక। యెడపక య్యా
కు మొక్క నేగెడిగాక। చెలపుపిమ్మటవచ్చి సేయంగరాదె। అలుకవీర్తు
దు మొక్కినట్లయుండుదదు। తడువు సేయక రావె తల్లి నీవనుచు। పెడగ
చ్చయిదిడల్లి కొడుకు దివ్వుచుడును। కొరతలుగడచిన కొడకవుగాక। చిరు
తలమాటల తెరగు లేయివియు। చెలమ సేయక యయ్యయలుక వీరండు। చె
లముగావించివచ్చెద బవ్వళింప। నరుగుము మీయయ్య యవసరంబిపుడు।
పరిపూర్తిగావించి పట్టియున్నడును। అల్లుక యెల్ల మికోప మట్లొక్క మా
టు। పలుకు లేకుండంగ వదిలంబు జేసి। తెలిపెదపిదప నిద్రింపు నీవిప్పు। డ
లుకదీర్పగ్గమున కొలది గాదనుచు। నాత్మజాహస్తంబు లల్లన బాపి। యా
త్మేశు దెస్సజూచి యతివసవ్వుచును। గోపయ సేయుచునుండ కొడుకిల్లు వెడ
లి। యుపశాపితాత్ముడై యొక్కండు మున్ను। దపతిత్తండ్రియొంగగదావొ

డ నేగు। క్రమమునజనితల్పు గత్రునవూం॥ నాథసుధారసార్ణవమగ్నుడై
న। మాదిరాజయ్యగారు మరిజాగిమొక్కి। అయ్యవారాయయ్య యాయమ్మ
తో బలుక। దయ్యోడి దాగదె యలుక మాన్పింతు। యిదినవల బిడ్డతోడ
మిదితప్పనందు। కదలద్దు మెదలద్దు గంబంబు నెమ్మి। జేరిచిన పటమున మా చి
యత్ర మొన్న మీరు। గరుణించినట్టియా గావిపచ్చడము। ముసిగిడి శిరము
న మొగమున మేన। భసితంబులదియట్ల పలుకకున్నాడు। నేడయ్యయమ్మ
గొత్త నేమంబుబట్టి। నాడనిలింగార్చనము సేయుచోట। చాలమ్రద వ్వోడి
యమ్మ చేమట్టి తాను। యలుక దీరండయ్య యటుగానియనుచు। నయ్యగారు
మొక్కుదమలుక దీర్చండు। నయ్యవరమ్మన్న పంబరపడక। యలుకదీ
ర్పగమన కొలదిగాదనుచు। జెలమాయమ్రద వ్వాడ జరినవ్వునగడి। యెలిగిన
నమ్మతో యెలిగెబోయేల। పలుకడనాథుండ పారణమైయుండు। కన్నంత
దరహాస కలితాస్యుడగుచు। యన్నన్న బాలలింగన్న రావన్న। యన్న
న్న బాలలింగయ్య రావయ్య। యంచు జేతులుసాంచు నరుగు దెసంత। సిం
చానురంబొగ్గు జెయ్యారగాగి। టను జేర్చి నూరుపీఠమునకు దిగిచి। కొను
నెత్తి ముందట కూకటిచువ్వ। జడయల్లి తుదితాల్చి ముడుచుబువ్వంబు।
వెడబుచ్చు కాటుక యిడుభూతినొసల। దలవంచుకొని మోము దప్పక జూ
చు। పులకించు తిలకించు దలతల మోపు। పక్కలు విరుగంగ పకపక నగగ।
గ్రిక్కించు చెక్కిలి గిలిగిలియనుచు। చక్కిలింతలుబుచ్చు ప్రక్కలు వొడు
చు। దొక్కులువినగోరు నొక్కించునోరు। ముదముననుజన్ని ముద్దు
లు వెందు। బొదలి పంచాక్షరి జదివించు బ్రీతి। నాయన్న నాకన్న నాచిన్ని
వడుగ। నాయయ్య నాపట్టి నాముద్దుకుర్ర। యెవ్వరిదాసి వీండెవ్వరి భృ
త్యు। డెవ్వరి తొంగ వీండెవ్వరి బంటు। బసవన్న యిలుపుట్టు బానిసకొడు
కొ। ముసిడిచౌడయగారి ముద్దుమనమండో। సురియచౌడయగారి పరిచా
రకుండో। కరికాలచోడని కట్టినయలుగో। కక్కయ్యవారిటి కావులవా
డో। చిక్కబసవరాజు శిష్యున తలియో। చిరాలదేలుని చెలికాండో పండి
తారాధ్యదేవు నెయ్యంపుపాతుండో। తెలుగుజొమ్మయ్యగారి తెరవెంట
కాడో। కలికేత బ్రహ్మయ్యగారి పుత్రుండో। పెద్దల బాచయ్య గుబ్బరా
నంబిభి। డ్డడో యమ్మవ్వ పెంపుడుగొడుకో। యేలేశు కేతయ్య కీలకు వాం

డో। పోలిగమారయ్య మాలబందరువో। శంకరదాసయ్య లెంకయో
స్సుంకి। బంకయ్యలింగిరో ప్రభువుశ్రీకాండో। చెన్నయ్యపన్న యోశీరా
లసంగ। కన్నబోకిన్నెరు కొడుకొసత్తిశు। చామయ్యగారి ప్రసాదియోపి
ద్ధ। రామునిఇంటో చేరమపుందకాడో। మాదిరాజయ్యగారిమనమడో చి
క్క। మాదనమా దేవి గాదిలిసుతుడో। యనుచుముద్దాడాడు మనుమన
న్వేడు। కనుబాడు నతిబూడుమని కొనుయాడు। నొక్కింతయాకొని యు
న్ననన్ జూచి। గ్రక్కునబాపని కాలమజ్జనము। సేయించుచో వెర చెయ్యి
వోయదినె। వోయిటురాలిన వోయెంటిపనులు। అటెలలింగన్న కారగిం
పంగ। ఇట్టుయరా వేనా పట్టియాకొనియె। ననిపిల్చు నమ్మకు పనిగల్లె నేని।
చనుడెందికడికడికిని దానెఱుడువు। యిచ్చమైనరకటం బెక్కించికొనుచు।
వచ్చుమిమ్మర్థిగోల్వగ వచ్చునపుడు। జడులకై వడినాత్మ సంతతి గూర్చి।
యదిమోహమున ముద్దులాడుటగాడు। ఆరంగనెదమయారాధ్యదేవు। పే
రుగావుననన్ను పెద్దమన్నించు। నొందంగరాగుంజు పోగుంజులాట। కుం
డెనగుడిగుడి గుంచంబులాట। యుప్పలవిందుల యాటబల్లారు। జప్పట్లు వె
ట్టుట సరిగుంజులాట। చేరబొంతలయాట చిట్లపొట్లాట। గోరుతయాట
దా గురుమూతదలాట। దీకొనుదిగుదిగు దికొక్కనునాట। లాకొంతునా
తొడ ధ్యాడెదువాండు। పిలిచినముందట నిలిచినబలుక। డలవోక యును
జూడ దలుకయెట్టిదయె। కాలమజ్జనముల వేళలదప్ప। బాలులతోనాడ బ
రువనెన్నదును। యమ్మోడీపండుల కరుగ్రిలుజూప। నమ్మనాకిదివెట్టి మనిస్వె
సరింప। ననయుంబు మాలింగమున కిచ్చికాని। కొననెపుదార్థంబులును దా
నమెరుగు। నలిగెమనంతయు న్యాయంబు సేయ। పలుకకుండుటకు నావల
నలేదగ్గు। యక్కజంబీయుల్క యిదియుమీచేత। జక్కగాకున్న దర్శన
మాత్రయుంద। విచ్చేయనే దేవవిచ్చేయవయ్య। విచ్చెయునాస్వామివిచ్చే
యుమనుచు। పుడమిజాగిలిమొక్కనడుగ్గల కెడగు। తొడగిదగుత్తుకతో
డసలేచు। ధరవెండియును మొక్కునరములింగంబు। నిరుపవ జాంకిట
నిరుకుచులేచు। చక్క జాగిలబడి జగతివెండియును । మొక్కునెంతయు
నేడ్పు మొగముతో లేచు। పెక్కుమారులు నిట మొక్కు పార్థించు। జ
క్కనసయ్య బచ్చడముజర్గంగు। పట్టితూనిగిలంగ బడిగుచ్చితివుచు। గ

ట్టల్కమీా చేత గానిబోదనుచు। నాపపడిభంగి నలమటపటద । యాపూ
రి మాదిరాజయ్యగారంత। దశనధిధీతులు వక్త్రమునదొల్కాడ । శిశు
వాక్యములకును జిరునవ్వునగుచు। నింటింటగలరుగా కిశోలవంతు । లింటి
తోపల జెలమ లెందునుగలరె। యలిగినదిట్టుదు రడతురుగాక । పలుకక
యుండుదు ర్భావంబుగలరె। నిలపాపలింటింటగలరుగా రెందు। దలపోయ
నిట్టి మగగలండెతొల్లి। యీనిమాటలుజూడ వేరొండువిధము। పదపద శి
శువవచ్చెదనంచునచటి। గదలిరె లెంచుదు ఘనమైనయట్టి। పదము నెగో
రమీా కవిదానసాక్షి। యదియునుగాక మహాభక్తవితతి। వావిరి దయసే
యు వరదనీ దాన। కావుననక లేశ దేవదేవుండ । యన్నడువలయు నాకిది
యనగాన। మన్నింతుగాక నామాత నేడనుచు। నీమాడ్కి నొకగీత మిల
మృదుమధుర। సమ్మిళితసవినయ సరసోక్తులలర। నానతియిచ్చుచు నల్ల
నసస్మి। తాననుడగు గృహంబుడగ్గరుచు। నేమిసేసెద వింటిలో మహాదేవి।
యేమిటినాడింతినీవరుడు। పడతినీపుత్రుండు బాలలింగన్న । నడరెయిని
ట్లుదా వెడవేలవచ్చె। ననుచునానతియిచ్చు నమ్మాత్రలోన । వినియుల్కి
పడి బలువిడి సెంగుదెంచి। చక్కజాగిలబండి మ్రొక్కుచు వెండి। యక్కాం
తపలుమారు నడుగుర కెరగి। నొక్కింత చనజొచ్చి చిక్కమాదన్న । యి
క్కడనీవిట్టు లేమిజేసెదవు। లేలెమ్ము చనుదెమ్ము లింగార్చనమ్ము। కాల
మాసన్నమ్ము గ్రక్కునరమ్ము। యటవిముక్తపదమ్మునందెసుఖమ్ము। స్ఫు
టభక్తిమార్గమ్ము భువిమనసొమ్ము। గానచైతన్యమ్ము గైకొమ్ము సహజ।
మౌనమ్ము ఘ్రానిమ్ము మాకుబ్రియమ్ము। పలుకననుదలమ్ము నలుకనెపమ్ము। క
లుషమ్మునీయడగలదని మమ్ము। నలుకవోనిమ్ము రమ్మని తెచ్చెమమ్ము। బలువి
డితధ్యమ్ము బాలలింగమ్ము। యనుచుదయావలోకన సుధాసార । వినుతప
యోరాశి వెల్లిపై బరప। యులసినిద్రించిన యధ్యగువోసి । తెలుపంగనొ
య్యన తెప్పిరినట్లు। కలయబ్రాణము మీన నెలకొనవేంపు। నులిగొల్పి క
రతలంబుల వ్రేళ్లువెనచి। తలనొక్కల్పి చెమటలు గూడనెక్క । వలనికి
శ్వాసిల్పి బాహులునూరటించి। కటములుబొమలు జిక్కనబట్టి ముక్కు।
పుటములునొత్తముల్ బొంకమాపెట్టి । తనువులుప్పుచు నిక్కచ్చునా
నావలించు। చనునోర్పులంద పుచ్చుచు గనువిచ్చె। ఘనుమాదిరాజయ్య

గారికట్టెదుర। ఘనసంభ్రమముఖీతి కంపంబుభక్తి। సుడిగొనిబిట్టుల్కి పడి
సాగిలంగ। బడిపదాబ్జంబుల పైపడిమ్రొక్కి। ధన్యుండపుణ్యుండ ధర నేన
విగత। దైన్యనిరస్తబాహ్యమహావ। దాన్యయనన్య సామాన్య లోకైక।
మాన్యదూరీకృత మాత్కృకాస్తన్య। జితమనోభవసైన్య హతభవజన్య। స
తతనిర్జరీతాన్య వసుధాపైతన్య। యనుచుగీర్తించి యుల్లాలునుదాను।
తనయుండు వెండియు ధరజాగిమ్రొక్కి। నంతభక్తాసీక ములరుచు మ్రొ
క్కి। జింతింపనిట్టి విచిత్రంబుగలదె। తనయునిబ్రాణంబు తండ్రిభక్తికిని।
ననుపక్తిశివునిగి కదిజెల్లనాడు। తనయునిభక్తికి దండ్రిబ్రాణంబు। నను
షక్తిశివునిగి కదిజెల్లనేడు। తనయునిభక్తికిదండ్రిబ్రాణంబు। ననుషక్తి
గురునిగి కదిజెల్లనేడు। మజబాపు సకలేశు మాదిరాజయ్య। మజబాం
పునద్భక్తమానసశయ్య। తావకమూర్తి దోదొలగాంచిన జ। నావళి బ
హుపాతకావళుల్ జెడవె। భవదతులితమూర్తి దవిలిగవ్గొన్న। నవనీతు
డైన గృతార్థుండుగాడె। వేయేల నీతనుచ్ఛాయపైబోలయు। బాయవె
జీవుని పాశబంధములు। బాగొందనీ స్నేహ పటువీక్షణమున। బధిరుం
డు సకలశబ్దశ్రోతగాడె। భవదీయకారుణ్య భరితేక్షణమున। ధృవము
మూకైన చతుర్వేదిగాండె। నెట్టణనీదయా న్వితవీక్షణమున। బుట్టుజీ
కువనైన బొదలవెదృష్టి। పాలించి నీదుకృపావలోకనము। వ్రాలిన వృద్ధై
క బాలుండుగాడె। యుంక్షింపనీరుఘృణావలోకనత। నంకురింపదెకోర్కెడై
ననతుణము। గణుతింపనీకాల్యకలితైకదృష్టి। గునహమైనను లేచి గునగు
నజనదె। భావింప నీహేహాభరితైక దృష్టి। దావానలంబైన దామంబు
గాదె। లీలనీహితదృగ్వి లోలసంగతిని। హాలాహలంబైన నమృతంబు
గాదె। మహనీయభవదీయ మహిమదలంప। సహజంబకాక ప్రశంసిం
పనద్ది। ప్రార్థింపగైకొని పైకొనిసుతుని। యర్థిసల్పత విజయంబునేసిడాసి।
పూనినీదయి ప్రాణదానంబుసేయు। మానుగానీచిక్కె మాదన్న మను
టు యిదిచోద్యమెయ్యంచు నిలభక్తవితతి। వదలకనిజకీర్తి వర్ణింపసెల్లు।
మాదిరాజయ్య సమ్మదలీలజిక్కె। మాదన్న ప్రాణంబు మహినెత్తెనాడు।
సరుదరుదనగ దయామతినేడు। గరుణించెపండితే గురుడుపాదములు। తె

పూజసేయు। ఫలముకోలతముముద్దు పట్టి త్రావనక। మృదుత్వమింగినసీవ త్రిమిం
గుడుగాక। కొడుకు బాహువ కేల కడిచేసితనక। గళమున విషవహ్ని దలవి
షపూరి। మలరేదువిషము విషాహిముం జేత। జ్వలనాక్షమిము గోరికాలు
చువారలకు। దలపోయుజ్జాడెట్లు దప్పునేయనక। చెచ్చెరసుతుప్రాణ మిచ్చి
ననడ। యుచ్చుసలాడెదయ భవమిూకనక। వీరభద్రయ్య యీబారిగడచి
న। వారకజాతర వచ్చెదననక। నసువక్తితో వేళ్ల నారతులిత్తు। మనుప
రిబుత్రి ప్రమథులారయనక। తాలుతుపసిడి పాదకులుమిూపేర। బాలు
గుడ్డవతల్లి బ్రతికింపుమనక। ఘనముగామూపున కండలిచ్చెదను। తనయు
మన్నరే పురాతనులారయనక। తల్లిదండ్రులుదమ తనయునిజూచి। మెల్ల
నెనవ్వుచు మేలయ్యెననుచు। ఖ్యాతిగాప్రమథుల కవిలయకెక్కె। జోత
సూజుండని బొంగుచుదార। యిరుగులపొరుగుల నిడ్లిండ్లభక్త। వరులు
ను నరులునెవ్వరుగానకుండ। వరసుతతద్గృహాంతర వేదియందు। పరమస
మాధిసంప్రాప్తిగావింప। ధీమణిగురుభక్తి తిలకుండుకదిరె। రేమయ్య
యును గురుస్వామిభజించి। పారిబారినెడ్డినంబులకు దదీయ। గురునియా
జ్ఞాపనశిరమునదాల్చి। మరలియాభక్తుని మందిరంబునకు। నరుగుదెత్తో
ల్లింటి యట్లభక్తుండు। మొక్కితత్కాల సముచితసత్క్రియలు। జకో
ల్పి లింగావసరము జెల్లించి। యంతప్రసాద భోగావసరమున। కాంతగాం
తునిజూచి కదిరె రేమయ్య। వచ్చినప్పటగోలె వరపుత్రిగానమెచ్చటను
న్నవాడేలతోడ్తేరు। మొన్నవచ్చినమారు మ్రొక్కమిూకంటె। మున్న
సాగిలిమొక్కె ముద్దుదోల్కాడ। నతియునీవును బరిచర్యలుసేయ। సు
తుడునందిచ్చుచు జూచుచునుండె। చెనసి మాలింగంబుచే ప్రసాదంబు।
గొనగజేయుగ్గిలా గొనిమొమిూవెనుక। వెండిమాయొద్దన నుండనే మిచ
ట। నుండనుండె గుమారుండేలయుండు। నింటిలోలేదిరుగింటపొరుగింట।
కొంటిబోవడు కడచంటినీవింటి। వెలుపలనిలుచుండి పిలువుమాతల్లి। బిలి
చినవినరాని బిడ్డలుగలరె। అనవ్రుడువంగళవ్వ నెనుతుబిలువ। తనయుబిల్వ
కయుండ దానునిమ్మవనె। పిలువనినిత్తువ్వ పిలిచెనంగవ్వ। యిలుపుట్టుగొం
తులకెనగానినన్ను। నెట్టణభక్తిసన్నిహితగాదలచి। పట్టిబిల్వగ బంపవా
డియెదేవ। వైరాగ్యముగునా బిల్వకయున్నసుతుని। కోరినసంసారంబగునా

తంబులుజేసి చేటలుచాల। గావించిబండ్లను గడిపియూరూర। నమ్మించి తె ప్పించియందుఖలబ్ధి। నెమ్మితో జంగమ నివహార్పణంబు। సేయుచు సద్భక్తి సిద్ధసద్గోష్ఠి। బాయకశుద్ధసద్భక్తి జనింప। జనులుగీర్తనసేయ విని వారివా రి। కనుమక్తి సందర్శనార్థమై తేర। శుద్ధాత్ము వేమయ్య జూచి నాకాంక్ష। నుద్ధతినొకరస సిద్ధుడే తెంచి। సేయుకాయకమును శివభక్తతతికి। బాయ కట్టులప్రణివత్తి సేయుటయు। గనియతివిస్మయా క్రాంతాత్ముడగుచు। ద నరసంసిద్ధియత్త రికంచుమున్ను। రసముశోధించి జారణలుగావించి। య సహావధంబుల రసతైలములను। దొరల బాషాణభృతులను మర్దించి। నెరయమూర్భకుదెచ్చి మరిచండికల్క। ముగసాంగము గ భిండములను భావించి। దగువజ్రమూవ మందవుకాకదీర్చి। అలరుపహ భాద నాప ధావ ళులు। బలుమరునందు లేపనముగావించి। వరమంత్రమూషి కావాత్రిసార మున। గర మొప్పదద్రనకల్పంబువొదివి। క్రమ మొంద భాగసంఖ్యనుమిత్ర పంచకము। దానికథర్తోత్తరము గ సంధించి। పొందుగానందించి మందతి వాగ్ని। లొందుపాక మెరిగి యూడించిపుచ్చి। సాంగ శీతలమైనయాఘు టికకును। భంగిగానట్లు దీపనముబుట్టించి। భువిజంత్రములు జటంబుల సా మధములు। దవులు బాషాణసత్వంబు హేమంబు। గర మొప్ప వ్రజసం ఘము గాసిమిచ్చి। పరితృప్తి బొందించి పండించినట్టి। చిరమూషి కాబద్ధ వరరసఘుటిక। విరచింపగసహస్ర వేదిదాననుచు। వినతుడైసిద్ధుండు వేమ య్యపాద। వనజాతములపొంత వడినిదియరగ। దగ్నుసిద్ధరసనిమిత్తంబున నర్థ। మగుకోటిసంఖ్యలకందులలబ్ధి। వలచినవస్తువ లిలజంగములు। క లరిచియిత్తుగాయక మేలయనక। వాండుసిద్ధుండిడి వదరసంబనక। పొడిగా నొకపూరి పుడకకునొనక। పాయకతనుసేయు కాయకంబట్లు। సేయుచు వే మసుధీయుతుడుండ। నంతమున్న దానట్టయున్కి జేసి। యింతవృత్తాంతంబు నెరిగియొక్కయ్య। ధరణినచ్చటనున్న వదరసఘుటిక। యెరు లెరుంగక యుండ నొయ్యనవురికి। యెరు లెరుంగక యుండ నొయ్యనవురికి। కొన్నిహో యిప్రజలును వనితయు దాను। మనుచుండె సకలసమగ్రతదనర॥ అంతసి ద్ధుడు వేమయ్య నలంచి। యింత కెట్లుందునో యిబ్రతిలేని। రసమిచ్చితి బడయ రానినిగల మై రససిద్ధి రాజుల రాజుగాండెల్ల। సూతుముగాకయుం

లర్పింపనంత। సరిబసవధ్యాన పరమామృతంబు। భరితమై దేహ కుంభ
మునదైవారు। పొలుపునంతః ప్రపూరితబసవ। కలితశబ్దంబు వాగమృత
మైతనర। పశిబసవా బసవాయను వాక్య। మదరుడు బసవనామాంకితుం
డౌక్కొ। బాలుడోహోయంచు బరతేరగాంచు। తాలేచిబిట్టుల్కి దర
జాగిమ్రొక్కి। శ్రీవృషభేంద్రావతార ప్ర। భావస్వభావుండు బసవ
య్యవచ్చె। చట్టన నందికేశ్వరుడు శిలాదు। పట్టిదానైయున్న బసవయ్య
వచ్చె। భువినిద్వితీయ్య శంభుండను పేర। ప్రవితతంబొప్పు బసవన్న వచ్చె।
మండెగమాదన్న మాదాంబకడుపు। పండుగై పుట్టిన బసవన్న వచ్చె। సం
గమేశ్వరుడర్థ జనితంబునంద। భంగిగాగురుడైన బసవన్న వచ్చె। ధత్త్రి
డుబలదేవ దండనాయకుని। పట్టికిమగడైన బసవన్న వచ్చె। తొలమిగపం
డిసంగమేశుగురువుగ। బలికించి వెలసిన బసవయ్య వచ్చె। దండిబిజ్జలుడు
ప్రార్థనసేయదవిలి। బండరుగైకొన్న బసవన్న వచ్చె। మిండభక్తునికి న
మ్మేదినీనాథు। బండరువిచ్చిన బసవన్న వచ్చె। నాఘిండనికిజేవియాకీకయు
న్న। భామశిక్షించినబసవన్న వచ్చె। ముద్దసంగయ్యంగామకుని జేసినవి। ప
ద్దళినుండగు బసవయ్య వచ్చె। వంగకాయలు ప్రాణ లింగంబులుగన। భం
గుడైచూచిన బనవన్న వచ్చె। యేణాంకధరుభక్తు డెంగనే తేర। ప్రాణం
బు నెడ తాలికు బసవన్న వచ్చె। శూలి వేరొకరూపమైలీల వెండ। పాలాక్షు
మిచ్చిన బసవయ్య వచ్చె। ముదమునజొన్నలు ముత్తియంబులుగ। పదప
డిచూపిన బసవన్న వచ్చె।, పాలించియొకపెద్ద భక్తునిమేన। బాలుజూపి
నచుట్టి బసవయ్య వచ్చె। నసమప్రసాదమన న్యాహార్యమనుచు। వినము సే
వించిన బసవన్న వచ్చె। వడిదూరమున బసవాయనకడవ। బడకుండబట్టిన
బసవన్న వచ్చె। సిద్ధరాముడరయ శివుభృత్యులని। బద్ధుడైయున్నయా
బసవయ్య వచ్చె। పాలించినుదయ బాలించబుద్ధి। బాలుని శైవడి బసవ
న్న వచ్చె। నాబసవేశుండ నాబసవయ్య। నాబసవస్వామి నా బసవన్న।
తొలిమేననాపుణ్య ఫలమునని పుడు। నలినాక్షియుంచేసె నాగృహంబునకు।
కంటినేదర్శింప గంటిగీర్తింప। గంటిజాగిలిమ్రొక్క గంటిభజింప। ధన్యు
డనైన్యుండ ధరకృతార్థుండ। మాన్యుండగణ్యుండమహినేనయనుచు।
మకరవరమనుభాను ప్రొ వెల్లిగొనగ। ప్రకటరోమాంచకంచుకితాంగుడగు

చు। గద్గదస్వరముదా కంఠంబుననున। ముద్గతంబుగ వంగి మొగమోరవు
చ్చి। యొసగంగగను రెప్ప లిడక యాబాల। బసవన్న మొగము దప్పక చూ
చిచూచి। బసవాయనిన బాల బసవఁడో యనుఁడు। వసుధముందటియట్ల వ
డిఁజాగి మ్రొక్కి। బసవనాయనిన నాబాలుఁడో యనుచు। పసిగొని యడు
గులపై బడి పొరలు। బసవాయనిన నాబాలుఁడో యనుచు। గసివోవ యడు
గుల నొసలిడి రాచు। బసవేశ్వరా యన్న బాలుఁడౌ యనుఁడు। నసలార కౌ
కిట నందంద జేర్చు। బసవరాజా యన బాలుఁడో యనుఁడు। నెసగంగ నిరికిట
నిడికొని యాడు। బసివిగా యనిన నాబాలుఁడో యనుఁడు। వెసనెత్తి యెత్తి
శిరసున నొదదాల్చు। పాయకిట్టుల బసవా యన్న బాలు। డో యన్న గృతినే
గదా యని యుబ్బు। దనరుచు బాలు పాదముల గజ్జియలు। ధ్వనివుచ్చి ధ్వ
నివుచ్చి గునియుచునాడు। వరలుచు బాలుని వామ పాదంబు। గిరిగీటగా బ
ట్టి గేలికల్ సేయు। బసవయో బసవయో బసవయో బసవ। బసవయంచు
నుదాళ పద్ధతినాడు। జతిగీతముల బాలు సంస్తుతింపుచును। గతులుచూపు
చు నాట్యగతులకున్నాడు। కోడంగ గతి బాలుడాడుమనంగ। వెడుకమతి డొలు
కాడంగనాడు। బాలుండదన కేశ భరమూదినవ్వ। గ్రాలుచుసోలుచు గం
తులువైచు। జతితాళగతి బాలునుతగతి మరచి। యతిరతి కురికురి కాడు
చునట్లు। కొనిపోయి యంత బాలుని గృహాంతరము। ననుదివ్య సింహాసన
స్థుగావించి। బసవబాలుని పాద పద్మముల్ గడిగి। యసలార పాదోదకా
బ్ధినోలాడి। బసవబాలుని సమభ్యర్చితుడు జేసి। యసదృశ తద్దయారసవా
ర్ధీ మునిగి। బసవన్న కారగింపంగ బెట్టించి। యనమ ప్రసాదామృతాంబు
ధిదేలి। తాంబూలగంధమాల్యాంబరాదులుము। దంబున నర్పించి తన
యింటగలుగు। ధనధాన్యములు జీవ ధనమాదియైన। మును మంతయును
దెచ్చి ముందట బెట్టి। బసవబాలుండ నాపరమసద్గురుడ। బసవబాలుండన
కె బాలించుతండ్రి। బసవబాలుండ నాప్రాలిలింగంబ। బసవబాలుండ నా
ప్రాణలింగంబ। అవధరింపవె దేవ యనుచు నిల్చ్వార। సవిశేషమతివేమ
శరణుడొప్పించి। వనితయు దానును వడిజాగి మ్రొక్కి। జనులద్భుతంబంది
వినుతించునంత। కరమొప్ప బసవన్న చరణాంబుజములు। సురభూరుహ
ములశాఖరములుగా వె। పొలుపగు బసవన్న పుణ్యహస్తములు। వాలయు

నాసురభుల మందలుగావె। శ్రుతినొప్పుబసవన్న దివ్యచిత్తంబు। మఱియుం
పజింతామణుల యిక్కగాదె। యలరారుబసవన్న యమృతేక్షణములు।
దులు కాడుపరుస వేదుల గనుల్గావె। భావింపవేమయ్య బసవైకభక్తి। భా
వంబగరిగొన బలియుటజేసి। బసవన్న దివ్యరూపంబయా బాలు। దెసగనా
బాటిడ బసవన్న యగుట। బసవబాలునిమూర్తి ప్రత్యక్షమగును। నసమ
సంపదల కిల్లయ్యెనాయిల్లు। తవిసనతత్వాదార్థజాంబుల బ్బాలు। జననియుజ
నకుండు గొనిపోవమరియు। బసవన్న సామ్మ్ర మాపాలిదయంచు। నసమ
జంగమకోటి యంతనే తెంచి। పెనుమందవలలోని పృథువస్త్రసమితిగొ
నిపోవబోవ దక్కువగాకయుండ। మునుపాత్రింతరల ధాన్యములుబల్లబూ
న్చ। మునుపాత్రింతరల ధాన్యములు బొంగుచుండ। గోధనంబులు రొప్పి
కొనిబోవబోవ। గోధనంబులు లెక్కమిక్కుటముగ। తద్గృహోపకర
ణ తతిగొనిపోవ। తద్గృహోపకరణ తతులెక్కుడుండ। వాహన ధనధా
న్య వస్త్రాభరణస। మూహగోధనరాజిముందటికంటె। వెగ్గలంబై యున్న
వేమయ్యగారి। నగ్గించి యెగ్గించి హాటుభక్తవితతి। వెక్కసం బనుచును న
క్కజంబనుచు। మెచ్చుకుచుసొక్కుచు మోదంబుతోడ। నమ్మిన నిటువ
లె నమ్మంగవలదె। నమ్మితిమంద్రు యన్నగబసవేశు। దలచిననిట్టువలె దల
పంగవలదె। దలతుమంద్రు బసవదండనాయకుని। కొలిచిననిటువలె గొ
లువంగవలదె। గొలుతుమంద్రు బసవగుర్వావతారు। వలచిననిటువలె
వలువంగవలదె। వలదుమండ్రిద బసవప్రభువునకు। వలతురుగొలుతురు
దలతురు నెమ్మి। నిలనిట్టిచోద్యంబు లిటవొల్లినేడు। వింతుమెయిలుజూరవి
దుతు రెదొల్లి। కందుమెభక్తుల కథలయందైన। నిండిన యిండ్లును నిండిన
భంగి। నుండెబో వేమయ్య యురుభక్తిమహిమ। గనుగొనబాలు సాక్షా
ద్బసవేశు। దనినమ్మిటయు మనంబున నమ్మినట్లు। బసవేశ్వరుండు నిబ్బా
లునియందు। వసియించిసత్యంబు వరదుడై యునికి। వరదుడై యుటయు వర
సంపదలును। వరగృహాంతరమున వలిశాల్లుసెంత। ప్రకటంబుగ నివి బడ
య్యంగ రావు। గాకయుంతయునిగి కడిధియెగాక। పాయునిరితి బసవాయ
న్నమాత్ర। నోయన్న బాలుని నాయన్నగాంగ। భావంబుసద్భక్తి భావ
నాసక్తి। కావలునను నేలగతిబద్ధులాలు। జగమాలలోదిగాక సడిసన్న గాక।

నిగమార్థపరిపాక నిష్ఠితశ్లోక। పరమవిజ్ఞాన సద్భావవిలాస। దురితసంహార విధూతసంసార। సద్గుణోత్తుంగ ప్రసాదసర్వాంగ। చిద్గతనిజచిత్త శివతత్త్వవేత్త। యనసమవదాన్య పదానతధన్య। బసవనామోచ్చార ప్రతిదినాధార। యవికల్పసంకల్ప హారగుణాకల్ప। శివభక్తిగుణధామ చేటలవేమ। యనుచు ప్రార్థనసేయ ఘనుడ వేమయ్య। యను బాలబసవయ్యగొనియాడుచుండ॥ లీలమైనటుగొంత గాలంబుసనగ। శూలిభక్తుండు నంది

## నందికోలబల్లయ్యకథ

కోలబల్లయ్య । బాలునర్థోదయ కాలంబునంద। గ్రోలుచు లింగ సంస్కారు గావించి। ఖ్యాతమహాభక్త గణసంతతికి వి। భూతివీడియములొప్పగ నివేదించి। విమలాత్ములలపూరి వీరషోడశగణముల పేరిడి మహానందంపుతోడ। నతులసద్భక్త హస్తార్పితభూతి। సుతుఫాలమున బూసి సుదతియుబతియు। వీరశోడశు నెత్తి వేమయ్యగారి యూరుపీఠమ్మున నునిచి పట్టుదును। బసవన్న దలచుచు బాలునినొసల। భసితంబు బూయంగ నిసుకునదుమ్ము। నావేమవిభుడు శతాయుష్యమనుచు। దీవించిమరికొన్ని దినములుసనగ। కారణంబొండు లేకయునబల్లయ్య। గారిపుత్రిండు లింగము గూడనప్పుడు। తారునశామకృతమున వేమయ్య। గారేగుదేరంగ గాంచి షోడశుని। జననియుజనకుండు సంస్మృతవక్త్రి వనజాతు లగుచును వడిజాగి మొ్రక్కి। సముచిలాభ్యర్చనల్ సలిపితత్పుతుసె। బముగానరాకుండ పై చీరదిగిచి। యయ్యయుపధరింపు డవసరవేళ। మైయున్న ధని గృహాంతరంబునకు। దొడుకొనిపోవ పుత్రిని దెసజూచి। కదుగడుచిత్రమిాకొదుకున్న విధము। కదలదు మెదలదు గాలుసెయ్యార్ప। శదరిపడదు దనహస్తముల్దాస। యారగింపదుదృష్టి కడ్డమైయున్న। చీరతొబెనగదు చెలగియేడ్వంగ। యుద్రిక్తమతివెస దుగ్ధపాలోలి। నిద్రయోమఱిదీర్ఘ నిద్రయో చూడు। డనుచుగప్పిన వస్త్రిమటుగూడడివియ। బనిచిషోడశుజూచి బ్రహసితవదను। డగుచుమున్నెము శతాయుష్యమనుచు। దగిలిదీవించుట దలపకీబాలుని సుగ్రలోచనదీర్ఘ సుచితమేలింగ। విగ్రహాకరుణాసమగ్ర నీకనుచు। బసవయ్యదలచుచు నొసలనమ్మెన॥ భసితంబుజల్లి షోడశు నెత్తి దెచ్చి। తల్లిచెనిశి నిజసత్న్యపయోధి। వెల్లినోలార్పి వేవేగననుడు। అటు

మున్న సప్రాణుఁడై తనూభవుఁడు। కటకటనేడ్చుచు కరములదల్లి। చను
గవపుడుకుచు జన్నారగింప। జనులద్భుతంబంది సంస్తుతింపంగ। చేటలవే
మయ్య జిన్నిధిచంద్ర। జాటుభక్తుండు భవాటవివహ్ని। లీల నీక్రియనం
ది కోలబల్లయ్య। బాలునాషోడశు ప్రాణంబువడసె। నాదుపండిత మల్లి
నాథదేవుండు। నేడిచ్చెగృపపాద నీరజాతములు। తెల్లంబుగా మహాదే
వయ్యగారి। కెల్లవారునుజూడ నెలమిద్ధుల్యాడ। ననుచువెండియు భక్త
జనరాజియట్లు। జనుపురాతనభక్త చరితాంకనములు। హేతువుల్గానతిశ్రీ
తిగీర్తించు। చాతుర్యమునకు సజ్జనులుత్సహింప। వడిసన్మ్ర సద్భక్తి జగ
ములనెన్న। బడుమల్లికార్జున పండితేంద్రుండు। మహానియ్యసద్భక్తిమతి
వెల్లగొండ। మహాదేవశరణుండు మహిఁదొంటియట్లు। ప్రథితులై యుండిరి
బ్రస్తుతికెక్క। మృదుతరాన్యోన్య సంస్పృహాలీలదనర॥ శ్రీబసవేశ్వరశ్రీ
పాదభక్త। శ్రీబసవేశ్వర శివానురక్త। శ్రీబసవేశ్వర చిరదయాసిక్త।
శ్రీబసవేశ్వర చిద్భావయుక్త। శ్రీబసవేశ్వరాంచిత గుణాసక్త। శ్రీబసవే
శ్వర శిష్టమంత్రోక్త। శ్రీబసవేశ్వర స్థిరకథాసూక్త। శ్రీబసవేశ్వర శ్రీ
సముద్రిక్త। శ్రీబసవేశ్వర శ్రీయోభిషిక్త। శ్రీబసవేశ్వర చేతఃప్రయుక్త।
ప్రార్థితకీర్తి సూరనమంత్రియూథ। నాథ యిదిపురాతన ప్రకరణము॥
ఇదియసంఖ్యాత మాహేశ్వరదివ్య। పదపద్మసౌరభ భ్రమరాయమాన।
జంగమలింగ ప్రసాదోపభోగ। సంగతసుఖసుధాశరధినిమగ్న। సుకృడా
త్మపాలకురికి సోమనాథ। సుకవిప్రణీత భాసురతరదండ। నాయక బసవాం
క సఖ్యాతగుణగ। ణాయతకీర్తి దిగంతత్రిలోక। గురుపండితారాధ్య చరి
తంబునందు। కరముద్వితీయ ప్రకరణమొప్పారు॥

---

శ్రీ గురవే నమః.

శుభమస్తు - అవిఘ్నమస్తు.

# పండితారాధ్యచరిత్ర

## వాదప్రకరణము.

శ్రీగురులింగ సంచితదయాపాంగ। భాగమహోద్ధార పాల్కురి
సూర। వెండియునొకనాడు దండితవాది। పండితారాధ్యుడ ఖండితకీర్తి-।
సనద వ్రోలంపోరిసద్భక్తిమహిమ। దనరారవర్తించు దత్ప్రస్తవమున।
పండితారాధ్యుల ప్రభుశక్తిపరమ। పాండిత్యమును శివభక్తిపెక్కువయు।
సకలవిద్యాప్రౌఢి సర్వజ్ఞతయును। సుకృతచిహ్నాయు భావసిద్ధి చిచ్ఛుద్ధి।
శీలసంపదవచః సిద్ధియుజూడ। జాలక చాలన సంహ్యాభావమున। నరపతియ
గువేలనాటిచోడనికి। గురుడగుబౌద్ధుండు కుటిలుండు బాప। కర్మియుస
ద్వాదికపటుండుసకల। ధర్మేతరుండు వేదవిరుద్ధవర్తి। కష్టుండుసిష్టుండు
కడునికృష్టుండు। దృష్టుదు రాచారి ధూర్తుండుగావునను। వెలనాటి చోడని
బిలుపంగబనిచి। కలుషంబువ్రట్టిల్ల గానిట్టులనియె। లోకవంద్యుడవు భూ
లోకాధిపతివి। లోకపావనుడ వాలోకించిచూడ। లోకంబునీయాజ్ఞ లోని
దిగాన। లోకంబనగనీవ లోకేశనీకు। గురులగువార సద్గురులునులోక।గు
రులునుగాకయే గురులునుగురులె। తమకుజగద్గురుత్వం బెట్లువచ్చె। త
మకుపండితశక్తి దానెందుగలదు। బౌద్ధదర్శన పట్టబద్ధుండుగురుడో। శు
ద్ధవైదికశైవ బద్ధుండుగురుడో। బుద్ధుండుత్రిజగత్ప్రబుద్ధుడయేని। బౌద్ధం
బు మోక్షైక పదహేతువెద్ది। తమకులోకారాధ్య సముదితప్రభవ। దమ
కుజెల్లెడి పండితత్వంబుగాక। దైవంబురుద్రుండు దానయ్యెనేని। శైవంబు
మోక్షైక సాధనం బేని। యతనికియపుడు లోకారాధ్యమహిమ। యతనికి
బండితాహ్వాయముగానిమ్ము। వారికిమాకును వాదమిప్పింపు। వారినో
డింతు దైవంబనువార్త। వారింతునె నటువంటియారాధ్యు। గీరాధ్యు

బాడితు గిండితు నెరుగ। నటుఁజూతుఁగాని మీమాంసాచార్య ప్రతిభ। యిట్టు
బిల్వాగా బంపు మెడసేయకనుడు। స్వసమయస్థుల స్వవచనవిరుద్ధులను। ప్ర
స్ఫురపాపుల బౌద్ధవాదులను। శ్రుతివివర్జితులను సుజనదూషకుల। స
తతాపరాధుల జైనవాదులను। శ్రౌతకర్మభ్రష్ట సన్న్యాసులను వి। నీతవ
ర్జితుల నద్వైతవాదులను। బ్రహ్మబద్ధుల పరబ్రహ్మదూరులను। జిహ్వాస్వ
భావుల బ్రహ్మవాదులను। విద్వేషమతుల నసద్వాదరతుల। విద్వద్విము
ఖులన వేదవాదులను భ్రాంతిచిత్తుల పాంచరాత్రరతులని। రంతరపా
పులనాంతరాళికుల। పరమాత్మదూరుల పరపరాఙ్ముఖుల। నరివర్గరతులనే
కాత్మవాదులను। వైదికాచార వివర్జితమార్గ। చోదితమతులన భేదవాదు
లను। దైన్యస్వభావుల మాన్యేతరులజ। ఘన్యచరిత్రుల శూన్యవాదులను।
అల్పమతుల బహుజల్పకులను వి। కల్పతత్వజ్ఞుల కాలవాదులను। నిర్మిత
కర్మల నిర్దేవులనన। ధర్మప్రవర్తుల కర్మవాదులను। ప్రస్తుతపుణ్య పాప
స్వర్గనరక। నాస్తికచార్వాక నిస్తారమతుల। సుకృతవిదూరుల నికృతధా
ర్మికుల। వికృతైక వేషుల ప్రకృతివాదులను। ప్రచ్ఛన్న బౌద్ధ నిబద్ధమైచను
మ। దాచ్ఛాదితులను మాయావాదరతుల। భ్రమితులై యులియు శబ్ద
బ్రహ్మమంచు। భ్రమమించిపలుకు శబ్దబ్రహ్మపరుల। నాపోవహేతు దృ
ష్టాంతవిరహితు। లై పల్కనేరని యధ్యాత్మమతుల। ధరణిగార్యత్రయాం
తరమూర్తిభేద। మరయని పురుషత్రయైకవాదులను। తానెన్ని చూడనే
దర్శనమతము। గానిద్విపురుషైక కలితవాదులను। కార్యకర్తలనాదికర్త
గాబలుకు। నార్యేతరాష్ట్రమూర్త్యేకనామ్ములను। వేదభ్రమితులనవై
దికవిరచ। నాదికయంత్రవిద్యావిశారదుల। స్మార్తుల యోగశాస్త్రభ్ర
మితులబ్రవర్తితర సమంత్రవాదసిద్ధులను। సవిశేషతర్కశాస్త్రప్రమా
ణికుల। సవికలధర్మశాస్త్రాతీతచరుల। సంచితాఖిలపురాణాగమతత్వ। సం
చారితార్థ విచారదూరకుల। సకలతార్కికులను షట్తర్కవిదుల। ప్ర
కటకౌటిల్య శాస్త్రప్రబుద్ధులను। ఘటకశాదత్తుల బహుజల్పకులను। సక
లాగమికుల సచ్ఛాత్రిపాఠకుల। ప్రకటితకవిబుధ పండితాదులను। వీరా
దిగాగ వివిధకళావిధుల। పేరుపేరులగూడ బిలుపించిమరియు। సూరసీన
భకు రాఁగొంకడుచిక్కనను। భామణీశ్వరు నాజ్ఞ దప్పినవారు। జంగోయను

ము బరిచుట్టుజాటించి। పిండుగామునుమాంది బిలువంగబనిచి । మండలే
శామాత్య మంత్రిసామంత। దండాధినాథ ప్రధానప్రభృతులు। దాసులు
భట్లు నర్తకులుగాయకులు। దాసజనంబు విలాసినీజనము। హితులు భృ
త్యులు పురోహితులును రాజ। సుతులుబండరులు రాహుతులు వెంకలు
ను। ననువీరలాడిగానఖిలనియోగ। మునుగొల్వన్నృపతియుమూర్ఖ బొద్ధుం
డు। విభవంబుతో రాజ సభయునుబ్రవిష్ట । సభయునుగూడి యాసానమ
ధ్యమున। నుండిబొద్ధుడుగతరోక్కన్నుభోద్ధతిని। పండితేంద్రునిబిల్వ బంప
నల్లురికి। యుంకింపవ్రతికైన నధిపతికైన । నంకంబుదర్కంబు నన్నబోవల
యు। దానదప్పిమిబోత గవగుననుచు। మానితభక్తి సమగ్రతదనరి। లిం
గార్చనంబు సల్లీలగావించి। భంగిగాప్రమథులపాదముల్ దలచి। చెన్నొం
దజంగమాశీర్వాదములునస। మున్నతి దాసదాయుక్తిగైకొనుచు। ననలా
రవారికి నభిమతార్థంబు। లొసగుచు తగ్గమనోన్ముఖుండగుచు । ప్రఖ్యాతి
దోనమ రాజయ్యగారు। ముఖ్యంబుగాశిష్యు లాఖ్యాతయశులు । నరు
డొందగురుమల్లికార్జునదేవు। చరణంబుజములకు సాగిలి మ్రొక్కి । బసవ
కృపాపాత్ర పరవాదిజైత్ర। యసమానశౌర్యశివాశ్రమాచార్య। కరుణా
పరిష్కార ఘనశివాచార। నిరవధినిజపుణ్య నిఖిలవరేణ్య। ప్రమథానుగ
తశీల భక్తాతిలోల। సుమహాద్యశస్క విశుద్ధమనస్క।యసములో శారాధ్య
కుసుమయాసాధ్య। స్వసమయనిస్తార జగదేకవీర। హరభక్తి శుద్ధపంచా
క్షరీశిద్ధ। చిరదయారనుకుల్య శివగణలోల్య। గతదుష్టయంత్రజంగమ్మ ప
రతంత్ర। హితశుద్ధశైవ మయుక్తానుభావ। పండితనతపాద పరిచితవేద।పం
డితారాధ్య సద్భక్తసాన్నిధ్య। వీరావతార సంవిత్సుఖాధార। భూరియ
శఃపూర్తిజ బుధచక్రవర్తి । వరమూర్తి మీమహత్వముదలంచినను। పర
సమయములెల్ల పరపరగావె। సన్నుతనీనామ సంకీర్తనంబు। విన్నదుస్స
మయులు విరథులుగారె। ప్రమథాత్మ మీమహత్వంబెన్ననన్య। సమయు
లు గిమయులు భ్రమితులైచనరె। పండితారాధ్యమీ బరిచితపరమ।పాం
డిత్యనిత్య సంపాదితమహిమ। మొగిబొద్దసమయుల ముక్కుపైగత్తి।యొ
గినవాగ్హతసమయులలింపుకోల। తొలగనిభేదవాదుల ముక్కు గొర్రు।
యుల శాంచరాత్రవ్రతులతలగుండు। యేకాత్మవాదులహృదయశూలంబు।

